రీతమయినది (అనఁగా చెఱుకుయొక్క మొదటినుండి వరుసగా కణుపుకణుపునందును రుచి తగ్గినట్టే తగ్గిపోవుచుండును.).

౩౫. పు.—శోకేతి=శోకమను శత్రువునుండి రక్షించునది, అనురాగమునకు నన్మకమునకు చోటు. సృష్టమ్=సృజింపఁబడ్డది.

హాసపరా=నవ్వుచు. కామినీభిః=కాముకురాండ్రచేత. సతీ మసతీం వా=పతివ్రతనుగాని అంకుటాలినిగాని. మరిష్యామి=చచ్చెదను. లోహాగోళకమ్=ఇనుపగుండును. సజ్వమ్=అగ్నిత్రాటితో కూడుకొన్నదానినిగా. జగచ్చక్షుః=ఓసూర్యుఁడా. జాగ్రతి=మెలఁకువయందు. సుషుప్తౌ=గాఢనిద్రయందు. భావితః=తలంపఁబడ్డినవాఁడు.

దివ్యత్రయమ్=కాల్చినగుండును చేత నెత్తుట, ధనుస్సునుండి బాణమును ఒకఁడు ప్రయోగించి పఱుగెత్తుకొనిపోయి ఆబాణమును తెచ్చువఱకు నీళ్లలో మునిఁగియే యుండుట, కుండలో పెట్టియున్న నాగుఁబామును చేత నెత్తుట, ఇవి మూఁడు దివ్యప్రమాణములు.

౩౬. పు.—వియోగినీ=పతినెడఁబాసినట్టి. శక్రరహితేవ సుధర్మా=ఇంద్రుఁడు లేని దేవసభ వలె. అవధిమ్ అభిధేహి=గడవును చెప్పు. సందేశమ్=వార్తను. తారుణ్యా మదేన=యౌవన గర్వముచే.

౩౭. పు.—ఉమా రూపస్య=పార్వతీ స్వరూపునితో. సంగ్రామేషు=యుద్ధములో. భటేన్ద్రామ్=ఉత్తమభటులకును. దీప్తిః=ప్రకాశము. యది రోచతే=రుచించు నెడల. ప్రముషిత చన్ద్రమసి=దొంగిలింపఁబడిన చంద్రుఁడుగల, అనఁగా చంద్రుఁడు లేని, అనఁగా చీఁకటిగల. బలీవర్ద వ్యూఢేషు శకటేషు=ఎడ్లచేత మోయఁబడిన బండ్లలో. వేశ్యా.ఛేటీమ్=భోగముదాని చేడియను. పరితః=చుట్టు.

౩౮. పు.—వాసాంసి=వస్త్రములను. హితానుబద్ధా=హితముతోకూడినది. చారణః=నెఱవిద్యవాఁడు. జిగమిషవః=పోఁగోరినవారు. విపశ్చిత్=పండితుఁడు. ఆషాఢి=చదువఁబడినది. పుంరూపేణ=పురుష రూపముచేత.

౩౯. పు.—ఉత్తార్య=దింపి. ఝటితి=శీఘ్రముగా. ఆలోచయిత్వా=ఆలోచించి. వేద=ఎఱుఁగుదును.

తులనామితి=(దం.) సామ్యమును ఔను అనుసరించును చంద్రుఁడు ముఖచంద్రునియొక్క సుమా ఈబిడయొక్క; ఔన్ను అని వర్ణింపఁబడుచున్నది; ఎట్లు పోలిక అతనికి పాద్యమియందు చంద్రునికి!

వ్యవసిత=ఉద్దేశింపఁబడిన. రుక్మాణామ్=బంగారములయొక్క అనఁగా వరహాలయొక్క. వ్యధాయి=చేయఁబడినది. మదీయ నగరమ్ అధ్యాస్తే=నా పట్టణములో నున్నాఁడు.

౪౦. పు.—తురఙ్గాః పల్యాణ్యాన్తామ్=గుఱ్ఱములకు జీను వేయవలసినది. వ్యగ్రః=ఆసక్తుఁడు. అశ్రౌష్మ=విన్నాము. సంభూయ=గుంపుకూడి. యత్ర చారణ ప్రసఙ్గః సమజని=ఎక్కడచారణునితోడి కూడిక కలిగెనో. చరతాం చోరాణామ్=సంచరించుచున్న దొంగలయొక్క. పదత్రాణం త్రుటితమ్=చినిఁగిన పాదరక్షను. చర్మకార=మాదిగవాని.

ఉపస్థితే ఇతి= (తా.) ఆపద వచ్చినప్పుడే అందుమూలముగా పురుషులయొక్క కూడిక (స్నేహము) కొలువఁబడును(పరీక్షింపఁబడును). గాలి వీవనప్పుడు దూదిరాశికిని పర్వతమునకును ఏమియు భేదము అగపడదు గదా.

ఆపత్ నికష పాషాణో=ఆపదయనెడు ఒర గల్లునందు.

౪౧. పు.— అత్ర=దుఃఖము వచ్చినప్పుడు. అతిరేచ్యతే=ఎక్కువై యున్నది.

కాళిదాస ఇతి= (దం.) కాళిదాసా, విద్యయొక్క ఉల్లా, దాసునివలె తఱుమఁబడితి వేని రాజమార్గమందు పోవుచు ఇందు, ఇతరులకు, అందు ఏమి అవమానము?.

శకున్తః=పక్షి. మార్జయతి=తుడుచుచున్నాఁడు. ప్రసన్నః=తుష్టుఁడై.

పరిపత తీతి=(దం.) పడుచున్నాఁడు సముద్రములో సూర్యుఁడు, కమలములయొక్క కడుపులలో మత్తెక్కిన తుమ్మెద(పడుచున్నది), ఉద్యానవన వృక్ష రంధ్రమందు పక్షి (పడుచున్నది), యౌవన వంతురాండ్రయందు మెల్ల మెల్లఁగా మన్మథుఁడు (పడుచున్నాఁడు).

౪౨. పు.—ఉక్త్యా=మాటచేత. వదాన్య=దాత. తామ్ర అభావః=రాగియొక్క లేమి. శృఙ్ఖలైః=సంకెళ్లచేత. శాసనపత్త్రైః=(దాన) శాసనపురేకులచేత. పత్నీ=భార్య. సపాద శతమ్=పాతికతో కూడిన నూఱు, అనఁగా నూటయిరువదియైదు. భవకాః=వుక్కలు. ఉధార=ధరించెను.

౪౩. పు.—రిక్తి శాఖినః కృపాణీ వాణీ=దారిద్ర్యమనెడు చెట్టునకు కత్తియయిన విద్య (ఎప్పుడును కాశీపట్టణము విద్యాస్థానము).

దే వేతి=(తా.) ఓరాజా నీ ఈవియను సముద్రములో మునుఁగుచున్న దారిద్ర్యమునకు మదపుటేనుఁగులదొర (౧ ఏనుఁగులుకలవాఁడు, ౨. ఏనుఁగు) ఎవఁడును (ఏదియు) చేపట్టును(తొండముయొక్క పట్టును) ఇయ్యఁడు (ఇయ్యదు).

• త్రింశత్=ముప్పది. విలోచనః=గ్రుడ్డివాఁడు. దదానమ్=ఇచ్చుచున్నవానిని. వదన=ముఖము.

ఘట ఇతి=(దం.) కుండ పుట్టు చోటు, లేళ్లు పరివారము, భుజపత్త్రి వస్త్రము, అడవిలో నివాసము, దుంపలు మొదలయినవి ఆహారము; ఇట్టి గుణముగలవాఁడు అగస్త్యుఁడు సముద్రమును ఎందుచేత చేసెనో (ధరించెనో) కమలమువంటి అరచేతియొక్క పల్లములో; (అందుచేత) కార్యసిద్ధి మహిమయందున్నది మహాత్ములకు, లేదు సాధనములో. మూల్యమ్=ఖరీదు.

౪౪. పు.—రథ స్యేతి=(దం.) రథమునకు ఒకటే చక్రము, పాములతో కట్టఁబడినవి ఏడుగుఱ్ఱములు, (కాలు ఊనుకు) పట్టులేనిది దారి, కాళ్లు లేనివాఁడు సారథి కూడ; సూర్యుఁడు పోనే పోవుచు

న్నాఁడు తుదకు ప్రతిదినము హద్దులేని ఆకాశముయొక్క; కార్య సిద్ధి.—

విజేత వ్యేతి=(దం.) జయింపవలసినది లంక, కాళ్లతో దాఁట వలసినది సముద్రము, శత్రువు పులస్త్యబ్రహ్మయొక్క మనుమఁడు, యుద్ధభూమిలో సహాయులా కోఁతులు, కాలుబంటు మనుష్యమాత్రుఁడు ఇతఁడు, సమస్తమును సంహారించెను రాక్షసకులమును; కార్య సిద్ధి.—

చమ్పకలతామ్=సంపంగితీఁగను. సృప్తహామ్=కోడలిని.

ధను రితి=(దం.) ధనుస్సు పువ్వులది, నారి తుమ్మెదలమయము, చంచలదృష్టులుగల స్త్రీల దృష్టులయొక్క అగ్రము బాణము, చెలికాఁడును మందమతియైన (జలస్వరూపుఁడైన) చంద్రుఁడు, తానును ఏకాకి దేహములేనివాఁడు (మన్మథుఁడు), సకలలోకమును కలఁత పెట్టుచు న్నాఁడు; కార్యసిద్ధి.—అనర్ఘ్యాక=వెలలేని.

౫౫. పు.—పన్థా ఇతి=(దం.)ఓ దారీ తగ్గింపుము దూరమును, వదలుము నీ కఠోరతేజమును ఓసూర్యుఁడా, ఓ శ్రీమంతుఁడా వింధ్యపర్వతమా కరుణింపు దయతో ఇప్పుడే దగ్గఱకు రమ్ము; ఈప్రకారము దూరము పరుగెత్తుటచేత ఆయాసముగలదైన చూచి తమప్రియురాలిని ఓశ్రీమంతుఁడా భోజరాజా నీ శత్రువులు ప్రతిదినమునను మొఱ పెట్టుచున్నారు మూర్ఛపోవుచున్నారు.

ప్రాన్తేషు=అంచులయందు. ముమోచ=పెట్టెను. మృగయా ధ్వనేన=వేట తమిచేత. వరాహమ్=పందిని. అమర వాణీ పరిజ్ఞానమ్=దేవభాషా (సంస్కృతభాషా) జ్ఞానము. కలమాక=వరిని.

కలమా ఇతి=(దం.) వరి పంటచేత వంగినదై క్రిందిప్రదేశమునుండి ఆఘ్రాణింపఁబడిన పరిమళముగల మొల్లఁగలువలుగలదై, గాలిచేత కొంచెము కదపఁబడిన తలగలదై, మిక్కిలి చేయుచున్నది పరిమళముయొక్క తాగడుటను.

౪౬. పు.—న తే అభిధాస్యామి=నీకు చెప్పను. నిధానమ్=ని క్షేపము. జ్ఞాపయితుమ్ అభ్యాగామ్=తెలియఁజేయుటకు వచ్చినాను. ఉద్ఘాట్య=తెఱచి.

రాజన్ ఇతి=(తా.) ఓరాజా నిన్ను భూలోకమునకు వచ్చినచంద్రునిఁగా చూచి, రత్నరాశియను మిషచేతను నక్షత్రములు (చంద్రుని భార్యలు) వచ్చినవని తలఁచెదను.

లోకోత్తరమ్=లోకముకంటె పైదానిని (సర్వశ్రేష్ఠమును).

అబద్ధేతి=కట్టఁబడినమాయజాలుచేత దట్టమయిన గోడవంటి మెడగలది ఎక్కింపఁబడెనేని అధికారమును (అధికారమంను) సింహము యొక్క కుక్క, మదపుటేనుఁగుయొక్క గట్లవంటి కుంభస్థలములను పగులఁగొట్టుటయందు ఆసక్తమయినదానియొక్క ధ్వనిని చేయునా ఏమి సింహముయొక్క?

౪౭. పు.—ఆపన్నః=ఆపదలోనున్నవాఁడు. న వైదుష్యమ్=పండితులకుఁదగినది గాదు. ఉపపన్నమ్=(చేతికి) దొరకినది. ప్రజాపతేః=బ్రహ్మయొక్క. అంశు=కిరణము. తపన కర క్లాన్త=సూర్యుని కిరణములచేత వాడిన. లుబ్ధక వధూః=బోయవానిభార్యను, లేక, బోయదానను. పలమ్=మాంసము. శ్యామమ్=కొంచెము.

౪౮. పు.—సహజ మితి=వాస్తవమును చెప్పెదను రాజా దయతో వినఁబడునెడల, పాడుచున్నారు నీ శత్రువుల భార్యల కన్నీటి యేళ్ల తీరములయందు సిద్ధస్త్రీలు, పాటచేత గ్రుడ్డివై గడ్డిని మేయుటలేదు లేళ్లు; అందుచేత మాంసము దొరకలేదు.

గవాక్షే=కిటికీలో.

ఇత ఇతి=ఇక్కడ ఇక్కడ నీళ్లచే పగులఁగొట్టఁబడిన దరిగలది ఆనకట్టు సముద్రముయొక్క, ఇటువైపు దాఁటరాని స్వరూపముగలది విస్తారమయిన మంచు బురదగల కొండ యిది, ఇప్పుడు జరుగఁగా ఏనుఁగులయొక్కయు గుఱ్ఱములయొక్కయు నీరాజనకృత్యము, ఎటుఁ

గను పోవుదురో నీ శత్రువులు ఏమార్గము చేత. (ఎటుపోవుటకును మార్గములే దని తా. ఏనుఁగులకును గుఱ్ఱములకును ఆరతి యెత్తుటచేత జయము కలుగును.)

హాయమ్=గుఱ్ఱమును. ప్రతస్థే=బయలు వెడలెను. ఆరోపితేన్ధనమ్=మోపబఁడినవంటచెఱకుగలవానిని.

కియన్మానమ్ జలమ్ విప్ర=ఓబ్రాహ్మణుఁడా నీరు ఎంతలోలతగలది. ఎంతలోఁతు అనక ఎంతలోలత యని యడుగుట పొరఁబాటు. జానుదఘ్నం నరాధిప=మోకాలులోఁతు రాజా. బ్రాహ్మణుఁడు లోఁతును స్పష్టముగా తెలియఁజేయు దఘ్నచ్ ప్రత్యయమును ప్రయోగించి మానశబ్దప్రయోగమందలి పొరఁబాటును తెలిపినాఁడు.

దాపయతి=ఇప్పించుచున్నాఁడు అనఁగా ఇమ్చున్నాఁడు.

౪౯. వృ.—రాజ న్నితి=(దం.) రాజా బంగారపు ధారలతో నీవు అంతట వర్షించుచుండఁగా, దౌర్భాగ్యమను గొడుగుచేత కప్పఁబడియున్న నామీఁద పడవు బిందువులు.

త్వ యీతి=(తా.) మేఘుఁడవయిన నీవు వర్షించుచుండఁగా (ఆ వర్షముచేత) అన్నిచెట్లును చిగిర్చినవి, జిల్లేడు చెట్లమయిన మాకు ముందున్న యాకులయందు సందేహము. (ఇతరులకు నీవు విశేషముగా బహుమానము లిచ్చుచున్నావు. నాకు నీవలన సంభావనలేదు సరియే గదా, నాకట్టలమోపు కూడ పోవు నని భయ మగుచున్న దని తా.)

ఏక మితి=ఇతని (భోజుని) యుద్దేశ్య మొకటి ప్రయత్నము మఱి యొకటి; ఇతరునికి (సరాబునకు) పనిలో భయము లేదు. సదా నూర్యుని చేత (భోజుని చేత) తఱుమఁబడుచు నేయున్నది(న్నాను), సదా చీఁకటి (సేను) పరువెత్తుచు నేయున్నది(న్నాను).

జానుదఘ్నప్రభావాత్= (జానుమానమ్ అనక) జానుదఘ్నమ్ అన్నందునను. దారిద్ర్య విడమ్బితః=దారిద్ర్యము చేత వంచితుఁడు.

౫౦. పు.—కా స భేతి= (తా.) శుకుఁడు దేనికి సంతోషింపఁడో ఆసభ యేమిసభ? ఇత్యాది. సూత్ర బద్ధాః=దారముతో కట్టివేయఁబడిన. మిత్ర=సూర్యుఁడు, చెలికాఁడు. ఔర్వః=బడబానలము. బాడబ=బడబానలము, బ్రాహ్మణుఁడు. తటిత్=మెఱుపుతీఁగ.

౫౧. పు.—చిన్తామణిభిః జగత్ నో జీవతి=చింతామణులచేత ప్రపంచము జీవింప లేదు. నిరన్తరం జల భరైః తామ్-ఉర్వరాం సిఞ్చతా ధారేయేణ అద్య ధురం వహతా అమ్భోదేన త్వయా జగత్ జీవతి మన్యే=సదా నీటి బరువులచేతను ఆ సర్వసస్యాఢ్యయయిన భూమిని తడుపుచున్న భారమువహించునట్టి ఇప్పుడు భారమును వహించుచున్న మేఘుఁడవయిన నీచేత లోకము జీవించుచున్నది (అని) తలఁచుచున్నాను. భిత్తౌ=గోడలో. వ్యక్తాని=స్పష్టమయిన. సంచిత=కూడఁబెట్టిన. వ్యఙ్గాః=అంగహీనులు. కుష్ఠినః=కుష్ఠరోగులు. పఙ్గవః=కుంటివారు. అశ్నన్తి=అనుభవించుచున్నారు. దేహినః=ప్రాణులు.

౫౨. పు.—ప్రమోదభరాత్=సంతోషాతిశయముచేత. చేతోహరాః=మనోహరమయినవారు. ప్రణయ గర్భ గిరః=అనురాగ యుక్తమయిన వాక్కు కలవారు, వల్గన్తి=నడచుచున్నవి. దన్తి నివహాః=ఏనుఁగుల సమూహములు. తరళాః=చంచలములయిన.

నయనయోః సంమీలనే=కన్నులయొక్క మూయుటయందు, కన్నులు మూసినప్పుడు, చచ్చినప్పుడు. పణ్యవీథ్యామ్=బజాఱులో. పట్టదుకూలాని=పట్టువస్త్రములు. రాజకీయాః=రాజసంబంధమయినవారు. నికటే=సమీపమునకు. పటః=వస్త్రము.

భేకై రితి= (దం.) కప్పలు రంధ్రములలో శయనించునవి చచ్చినట్టే (పడియుండినవో), భూమిలోనికి చొచ్చినవో తాఁబేళ్లు, కొట్టిచేఁపలు గొప్ప బురద బల్లలమీఁద దొర్లుటచేత ఎందులో మాటిమాటికి మూర్ఛపోయినవో, ఆ యెండు సరస్సులో అకాలమేఘు

ము వచ్చి దానిని చేసినది, దేనిచేత కుంభస్థలమువఱకు మునింగిన య
డవి యేనుంగులయొక్క సమూహములచేత నీరు త్రాగఁబడుచున్నదో.

విష్ణ్వాఖ్యః=విష్ణువను పేరుగలవాఁడు.

౫౩. వృ.—ధారాధీ శేతి=ధారా (పట్టణపు) రాజా భూలోక
మండలి మహేంద్రులను లెక్కపెట్టుటయందు ఉత్సాహము గలవాఁ
డై దేనిని ఈ బ్రహ్మదేవుఁడు నీ లెక్కను చేసెనో బలపపు ముక్క
తో గీతను ఆకాశమందు, అది యే యీ దేవనది (ఆకాశగంగ) అ
యెను; నీ సాటి రాజు లేనందున దానిని (ఆబలపపుముక్కను) పాఱ
వేసినాఁడు; అదే యిది భూమి మీఁద మంచుకొండ.

జీర్ణ మపి=ప్రాఁతదయినను.

.నిరవద్యాని=(దం.) నిర్దోషమయిన పద్యములు కలిగినయెడల ద
రిద్రునికి ఏమి లోపము? కక్ష నిక్షిప్తః=చంకలో పెట్టుకొనఁబడిన.

ఏతే ష్వితి= (దం.) వీనిమీద అయ్యో బలమయిన గాలిచే రేపఁ
బడిన దావాగ్నులచే కబళింపఁబడిన చెట్లమీఁద నీటిని ఓ మేఘమా
వదల వేని వదలకుము, పిడుగును మఱి పడవేసెదవు నిర్దయుఁడా ఏ
హేతువుచేత?

౫౪. వృ.—శోచ్యత మే ఽమయి=మిక్కిలి కనికరింపఁదగిన నావిష
యమై. సోమనాథేన కల్పద్రుమాయితమ్=సోమనాథుఁడు కల్పవృ
క్షమువలె ఆచరించినాఁడు. వన వీరుధామ్=అడవి తీఁగలకు. న తర
తి=ఇయ్యఁడు (ఇయ్యనియెడల). ఫణా ఫలక స్థితామ్=పలకలవంటి
పడగలమీఁద నున్నట్టి. కమఠ=తాఁబేలు. పయోనిధిః క్రోడాధీనమ్
కురుతే=సముద్రుఁడు రొమ్ములో పెట్టుకొనుచున్నాఁడు. చరిత్రవి
భూతయః=చరిత్రైశ్వర్యములు, ఉత్కృష్టచరిత్రములు. నిస్సీమానః=
హద్దులేనివి. నీడతా త్వద... ఉేన చాత కేన=పడియున్నట్టియు నీశ
దురున్నా తెలుపఁబడిన వెదకిలఁబడియున్న ముక్కగలిగినట్టియు వా
నకోయిలచేత.

౫౫. పు.—ఆస్తామ్ తావత్=అటుండ నిమ్ము. ధిక్ జీవితమ్=బ్రదుకు నింద్యము, ఛీ ఈబ్రదుకేల. భాణ్డారిక=ఓ కోశాధికారీ. జలధౌ=సముద్రమందు. యావన్తిఆసన్=ఎన్నియుండినవో. తావన్తః=అన్ని. ఉదార=ఓదాతా. మా భూత్=కాకుండును గాక. ఇయమ్=ఈనక్షత్రరూపమునను న్న. దుశ్శీలతా భాజనమ్=దురాచారమునకు పాత్రము.

౫౬. పు.—నిర్జ్ఞాతమ్=చక్కఁగా తెలిసికొనఁబడినది. ప్రసాదే=దయయందు. తృణకణాయతే=గడ్డిలేశముగా ఆచరించుచున్నది (అగుచున్నది). క్షీరాబ్ధి తుల్యమ్=పాలసముద్రముతో సమానముగా. న క్షమతే=ఓర్వఁజాలదు. గ్రీష్మ ఊష్మణా=వేసవియొక్క వేఁడిచేత. వర్ష తావత్ కియత్=వర్షింపుము అందాఁక కొంచెము. ఆస్తర ఆసన్న=పడకకు సమీపస్థుఁడవు. ఉపవీత=జంధెము.

౫౭. పు.—క్షుత్క్షామా ఇతి= (దం.) ఆఁకలిచేత క్షయించిన శిశువులు శవముల వలె, మిక్కిలి మందమయిన యభిప్రాయముగలవారయిన (ఆదరము మానిన) బంధువులు, అంటింపఁబడినది పగిలిపోయిన గరిగపిడత లక్క లేశములచేత, (ఇదంతయు) నన్ను అట్లు బాధింపదు; (నా) భార్యచేత చినిఁగిపోయిన బట్టను కుట్టుకొనుటకు చేసి స్వరవికారముతో కూడుకొన్న నవ్వుచు (నవ్వి) కోపగించుచున్నదైన ఎదుటియింటి వాని యిల్లాలు సూదిని ఎట్లు యాచింపఁబడినదో. (ఎదుటింటి యిల్లాలిని సూది అడుగుట ఎట్లు బాధించెనో అట్లు అని పూర్వార్ధముతో అన్వయము.)

అభ్యుద్ధృతా ఇతి= (దం.) చక్కఁగా ఉద్ధరింపఁబడినది(పాలింపఁబడినది, ఎత్తఁబడినది) భూమి, ఖండింపఁబడినది శత్రుసమూహము, గ్రహింపఁబడినది బలవంతునిచేత బలవంతులయిన రాజులయొక్క సిరి (బలిచక్రవర్తియొక్క ఐశ్వర్యము), ఒకజన్మమందు చేయఁబడిన

దో ఏది యీాయాావనవంతునిచేత, మూఁడు (వరాహ పరశురామ వామన జన్మములలో) దానిని చేసెను పురాణపురుషుఁడు (విష్ణుమూ_ర్తి).

హరిణ్యాం బాణేన విద్ధాయా మపి=లేడి బాణముచే కొట్టఁబడినను,

శ్రీభోజే ఇతి= (దం.) శ్రీమంతుఁడైన భోజరాజు వేఁటకు పోయినను, త్వరగా విల్లు ఎక్కు_పెట్టఁబడినను, చెవి చెంతకు వచ్చినను (అనఁగా నారిని చెవివఱకు ఆకర్షించినను), పిడికిటినుండి జాతి బాణము దేహములో గ్రుచ్చుకొన్నను, (ఉన్న) చోటినుండి పాఱిపోలేదు, కదలలేదు, వణఁకలేదు, దుముకలేదు, లేడి;నాకు వశ్యునిగా చేయును (నా) ప్రియుని మన్మథుఁడు ఇతఁడు అనెడు ఆశచేత. (భోజరాజు మన్మథునివంటి సుందరుఁడని తా.)

జాహ్నవీ=గంగానది. విదుషీ=విద్వాంసురాలు.

౫౮. పు.—భోజ ఇతి= (దం.) భోజునియొక్క ప్రతాపమను నిప్పు క్రొత్తది ఇది ప్రకాశించుచున్నది రాజుల పట్టణప్రదేశములయందు; ఏభోజప్రతాపాగ్ని ప్రవేశింపఁగానే శత్రురాజులయొక్క గడ్డి మొలచుచున్నది ఇంటి ముంగిళ్లయందు. (సామాన్యమయిన యగ్నికి గడ్డికాలిపోవును, ఈయగ్నికి మొలచును అని దీనియందు అపూర్వత్వము. ఈయన ప్రతాపమునకు జడిసి శత్రురాజులు తమపట్టణములు వదలి పాఱిపోఁగా అవి పాడై అందు గడ్డి మొలచె నని భావము.)

శ్రీమ న్నితి= (దం.) శోభాయు_క్తమయిన ఓగంధపుచెట్టా కలవు అనేకములు ఆ చెట్లు అడవిలో వేనికి పరిమళమున్మాత్రము ఉండును బహుశః పువ్వుల శోభతో (పువ్వు లున్నంతకాలమ్మే). ప్రత్యవయవమందును చక్కఁగాచేయఁబడిన ఆ తెల్లని కొనియాడఁబడిన ప్రసిద్ధస్వరూపుఁడవయిన ఏ యీ పరిమళ గుణము నీచేత ప్రకటింపఁబడినదో ఎక్కడ అది ఇక్కడ (కడమచెట్లలో) చూడఁబడును?

సూత్రధారీ=నటి.

బలి రితి= (దం.) బలి (చక్రవర్తి) పాతాళము నివాసము గాఁగ లవాఁడు క్రిందుచేయఁబడినాఁడు, ఆశ్చర్యము ఇందు ఏమి? క్రిందు చేయఁబడినది స్వర్గముననున్న దైనను ఆశ్చర్యము కల్పవృక్షము నీచే త! (బలికల్పవృక్షములకంటె భోజరాజు దాత యని తా.)

౫౯. పు.—సహకార తరోః=తీయమామిడి చెట్టుయొక్క. వితతాః=వ్యాపించినవి.

పరిమ శేతి=సువాసనయొక్క అతిశయముచేత కూడుచున్న తుమ్మెదల సమూహముచేత చీల్పఁబడిన చిగుళ్లుకల చెట్లు కొద్ది.

భాగ్యాధీనాః=అదృష్టాధీనములు. భూతి=ఐశ్వర్యముయొక్క. ధనసంచయకర్త్రాణి=ధనముయొక్క కూర్చుటయొక్క కర్తలు, అనఁగా ధనమును కూర్చునవి. పృథగేవ హి=వే రే సుమా.

ఆత్మాయత్త ఇతి=(దం.) స్వాధీనమైయుండఁగా గుణసమూహము, గుణములేమి నిందింపఁదగినది. అదృష్టాధీనములయియుండఁగా ధనములు, పురుషులకు ఏమి దోషము? (గుణహీనత దోషముగాని ధనహీనత గాదు అని తా.)

అస్ఖలిత... ప్రసరః=తడఁబడని ... విజృంభణకలవాఁడు.

౬౦. పు.—వాఙ్మయ జాతమ్=వాక్స్వరూపముయొక్క సమూహమును. హస్త అమలకవత్=చేతిలోని ఉసిరికకాయవలె.

ధారాధరః ఇతి=(దం.) మేఘము (ధారగలది) నీకత్తి యిది, ఓరాజా ఆశ్చర్యమే వర్షించుచున్నవి శత్రు (స్త్రీ) జనములకన్నులు; (వారు నీకత్తిచేత తమభర్తలు తెగఁగా ఏడ్చుచున్నారని భావము). ధనము తో (ఒరతో) ఎప్పుడా సాంగత్యములేమి యుద్ధములో దీనికి (కత్తికి), పేదఱికము కలుగుచున్నది (నీ) శత్రు రాజులకు. (యుద్ధములో నీకత్తికి జడిసి శత్రువులు తమసిరి నంతయు నీకిచ్చి పేద లైరని భావము.)

కిం జాత ఇతి=ఏల పుట్టినావు (మొలచినావు) నాలుగుదారుల నడిమి కలో? మిక్కిలిదట్టమయిన నీడగలవాఁడవు అయినావు ఏల? నీడచే

కప్పఁబడినవాఁడ వయినను ఫలములుగలవాఁడవు అయినా వేల? ఫల భారములతో నిండినవాఁడ వయినను ఏల వంగినావు? ఓ మంచిచెట్టా సహింపుము ఇప్పుడు చాలసేపు కొమ్మలయొక్క అగ్రములయొక్క (అగ్రములను) లాగుట కదపుట త్రుంచుట విఱుచుట (వీనిని) జనుల వలననుండి నీవే అయిన (చతుష్పథములో మొలచుట మొదలయిన)దుష్టచేష్టలచేత. (దుష్టునియొద్దికి వత్తురా? నీవు సౌమ్యుఁడవును దాతవును గనుక నీయొద్దికి యాచకులు వచ్చుచున్నారు—అని భావము.)

కూర్మ ఇతి=(దం.) తాఁబేలు పాతాళగంగయొక్క (భోగవతియొక్క) నీటియందు విహరించునుగాక, ఆపాతాళగంగయొక్క గట్టున మొలచిన తుంగముస్తెలను గ్రహించునుగాక ఆదివరాహము, సల్లించుకొనునుగాక పడగల సమూహమును నాగేంద్రుఁడు, దిగ్గజములు తామరతూండ్లయొక్క భక్షణ వ్యాపారమును చేసికొనునుగాక, పర్వతశ్రేష్ఠములు అన్నియు యథేచ్ఛముగా సంచరించునుగాక, నీవు మోయుచుండఁగా ఓప్రభూ భోజా దేవతను భూమిని (భూదేవిని). (కూర్మాదులు సదా భూమిని మోయుచున్నవి, భూభారమును భోజరాజు వహింపఁగానే వానికి తమ నౌకరీనుండి ఆటవిడుపు గలిగెనని భావము.)

౬౧. పు.—వదాన్యః=దాత. సంజల్పవత్=ముద్దుమాటలవలె. ఏలా ఉశీర=ఏలకులు వట్టివేరు. లసత్=ఒప్పుచున్న. జాజీ... తామ్=సన్నజాజిపువ్వులు పాదిరిపువ్వులు మొగలిపువ్వులు వీనిచేత పరిమళవంతముగా చేయఁబడిన మంచినీళ్లు తేఁబడునుగాక. మాగధః=వంది.

వక్త్రాంభోజ మితి=(దం.) ముఖ కమలములో సరస్వతీనది (విద్య)వసించియున్నది. శోణమనెడు ఏఱే (ఎఱ్ఱనిదే) అధరోష్ఠము నీది. చేయి శ్రీరాములయొక్క పరాక్రమముయొక్క స్మరణను చేయుటయందు సమర్థమయినది దక్షిణదిక్కున నుండునది (కుడిది) నీది సము ద్రము: (ముద్దుటుంగరముగలది), నదులు (సేనలు) ప్రక్కను ఇవి

ఎట్లును నీయొక్క వదలనే వదలవు సదా, తేటగాయుండఁగా మనస్సు, ఏల కలిగెను చెప్పుము రాజా నీకు నీళ్లుత్రాగుటకు కోరిక?

అష్టా వితి=(దం.) ఎనిమిది బంగారపు (వరహాల) కోట్లు, తొంబది మూఁడు ముత్తెముల తులలు (౧౦౦పలములు=౧తుల), ఏఁబది మదము యొక్క వాసనచేత మదించిన తుమ్మెదలుగలవి కోపముచేత గర్వించి నయేనుఁగులు, గుఱ్ఱములు పదివేలు, లోకములో (నంతయు) నేర్పుగల వేశ్యలు నూర్గురు, ఈయఁబడినది పాండ్యరాజుచేత కప్పము మాగధు నికి ఇయ్యఁబడునుగాక.

శీతార్తమ్=చలిచే బాధపడుచున్నవానిని.

శీతే నేతి=(దం.) చలిచేత అధివసింపఁబడినవాఁడనైన మాఘమాసపు నీళ్లవలె, చింతాసముద్రములో మునుఁగుచున్న, చల్లారిన పేఁడిగల, పగిలిన క్రిందిపెదవిగల, బుసకొట్టుచున్న, ఆఁకలిచేత క్షయించిన కడుపుగల—నాకు, నిద్ర ఎక్కడికో అవమానింపఁబడిన ప్రియురాలి వలె వదలి దూరము పోయినది, మంచిపాత్రునికి దానముచేయఁబడిన సిరివలె క్షయింపకున్నది రాత్రి.

౬౨. పు.—దివా=పగలు. జాను భాను కృశానుభిః=మోఁకాళ్లు సూర్యుఁడు నిప్పు వీనిచేత.

ధారయి త్వేతి=(దం.) ధరించి తమ స్వరూపమును అధికమయిన యీవియే ధనముగాఁగలవాఁడా, ఇప్పుడు విడిపింపఁబడినారు బలిచక్రవర్తి కర్ణుఁడు మొదలయినవారు తమ కీర్తియనెడు రహస్యపు ఇంటినుండి. (బలికర్ణాదులకీర్తి రహస్యమైయుండెనేగాని భోజునికీర్తివలె జగద్విదితమ్ముగాదనియు వారే భోజరూపమున అవతరించి ఇప్పుడు పూర్ణకీర్తిని పొందినారనియు వారికన్న నితఁడు అధికదాత యనియు భావము.)

కాన్త ఇతి=(దం.) ప్రియమైనదానవు (ప్రియమయినవాఁడవు), ఎల్లప్పుడును తియ్యనిదానవు (తియ్యఁగా పలుకువాఁడవు), రసముచేత

నిండినదానవు (శృంగారాదిరసములయందు ఆసక్తుఁడవు), మఱియు అగుదువు అయిదు బాణములవాని (మన్మథుని) ధనుస్సవు ఈడులేని (మన్మథబాణమువలె స్త్రీలను మోహపెట్టువాఁడవు); ఓచెలికా నీకు ఉన్నది సమస్తము మంచిది, ఒకటి లోపము, ఏమనఁగా భక్షింపఁపడి (ఆశ్రయింపఁబడి) పొందుచున్నావు రసహీనతను క్రమముగా.

శశాఙ్కమ్=చంద్రుని.

యద్దేతదితి=(దం.) ఏ యిది చంద్రునిలోపల మబ్బుయొక్క లేశముయొక్క విలాసమును చేయుచున్నో (మబ్బుముక్కవలె అగపడుచున్నదో) దానిని చెప్పును మనుష్యుఁడు (దానిని లోకు లందురు) కుందేలని, కాదు నన్నుఁగూర్చి అట్లు (అది నా మతము గాదు).

సౌధాన్తరమ్=మేడలోపల.

అహమితి=(దం.)నే నో చంద్రుని తలఁచెదను నీ శత్రువులయొక్క విరహముచేత ఆక్రమింపఁబడిన స్త్రీలయొక్క కడగంటిచూపుల నెడు కొఱకంచుల రాలుటచేతనైన గాయముల మచ్చల గుర్తులచేత చిహ్నితమయిన దేహముగలవానినిగా.

మహాభాగ=మహానుభావుఁడా.

౬౩. పు.—ప్రతివిహిత మృత్యు ప్రతిభియే=పోఁగొట్టఁబడిన చావుయొక్క భయము కలవానికి (అభయ మిచ్చి). ఉపరితన=పై. కృతే=కొఱకు. దశన కోటి క్షత గరీణ=దంతముల కొనలతో పగుల్పఁబడిన పర్వతములు గలవైన. మద ముదిత కూజత్ మధులిహః=మదముచే సంతోషించిన ఝుంకరించుచున్న తుమ్మెదలు గలవానిని.

ఆమోదైరితి=(దం.)పరిమళములచేత వాయువులు, లేళ్లు చిగురుటాకుల ప్రసరములచేత, నారచేత తాపసులు, పువ్వులచేత తుమ్మెదలు, పండ్లచేత పక్షులు, ఎండచేత బాధింపఁబడినవారు నీడచేత, ప్రమాని చేత మదపుటేనుఁగులు, నీచేతనే చేయఁబడినవి అన్నియు ధన్యము

లు; నీవు లోకోపకార సమర్థుఁడవయియున్నావు. నీచేత పోఁగొట్టఁబడిన యాపదగలవి కడమ చెట్లు.

౭౪. పు.—ఫణితిః=ఫక్కి. వమతి=క్రక్కుచున్నది. అనధిగత=పొందఁబడని.

అర్ధ మితి=(దం) సగము విష్ణుమూర్తిచేత (విష్ణుమూర్తి ఒకప్పుడు మోహినియై శివునికి భార్యయయినాఁడు. భార్య పురుషుని యర్థదేహమని శాస్త్రములు చెప్పుచున్నవి.) పార్వతిచేత కూడ సగము శివునిది హరింపఁబడినది, ఓరాజా ఈప్రకారము భూతలమందు త్రిపురహరుని (శివుని) యొక్క అభావము వెల్లడియైయుండఁగా (అనఁగా శివుఁడే లేకపోఁగా); గంగానది, సముద్రమును, ఆకాశమును చంద్రరేఖ, నాగేంద్రుఁడు భూమియొక్క యడుగును, సర్వజ్ఞత్వము ఈశ్వరత్వము పొందెను నిన్ను, నన్ను భిక్షాటనము.

తా.—నేను మహాదరిద్రుఁడను నీవు మహావిద్వాంసుఁడవు మహైశ్వర్యవంతుఁడవు; నాదారిద్ర్యమును పోఁగొట్టవలయునని ఎఱిఁగినవాఁడవు, పోఁగొట్ట సమర్థుడవు.

అనురాగిణీ=అనురాగము (ప్రేమ) కలది. ఆశు=శీఘ్రముగా.

కేచి దితి=(దం.) కొందఱు వేరునందు వ్యాపించిన ఆశగలవారు (వాగ్వల్లియొక్క వేరునుమాత్రమే చూడఁగోరుదురు), మఱి కొందఱయినను మొదటిపలవలతో సంబంధము పొందినవారు, నీడను కొందఱు పొందినారు, మూలాగ్రములను మఱికొందఱు, (మఱికొందఱు) చిగుళ్లను కోయుదురు, ఇతరులు పువ్వులను చేత ధరింతురు, వారికన్న నితరులు పరిమళమునకు మాత్రమే పాత్రము, వాక్కునెడు తీఁగయొక్క; మఱి యేమనిన మూఢులు పండును అహాహా నిశ్చయముగా చూడనైనఁ గోరరు.

పరిచ్ఛిన్న ఇతి=పరిమితమైన రుచి అమృతము బెల్లము మకరందము తేనె పాలు వీనిది; ఒకానొకప్పుడు పలుమాఱు అనుభవించుట

చేత పొందును కదా రుచిహీనతను అధికమయినదానిని; ప్రియురాలి దొండపండువంటి పెదవియందును రుచిగల కవివాక్యమునందును పొద్దులేనిది శ్రోత్రయానందము గలది ఏదో (చెప్ప శక్యము గానిది) ప్రకాశించును సుమా రుచి ఇది సాటిలేనిది.

౬౫. పు.—నానీయన్తే ఇతి=(దం.) తేఁబడవు తేనెవిషయమై తుమ్మెదలు పారిజాతపుష్పములచేత (మాయొద్ద తేనె కలదు రండు త్రాగుఁడు అని తుమ్మెదలను పారిజాతపుష్పములు పేరంటము పిలువవు. పిలువఁబడకయే తుమ్మెదలు వచ్చి త్రాగును)• ప్రార్థింపఁబడవు చంద్రునిచేత వెన్నెలవిషయమై చకోరములు. మా వాక్కుయొక్క మాధుర్యముయొక్క అతిశయమును పొంది (విని, ఎఱిఁగి) ముందుగా (మీఁద మీఁదఁబడి) వచ్చువారు (ఏ మయిన కవనము చెప్పుఁడు చెప్పుఁడు అని) దిగ్గఱయైనమాటలుగలవారు (దిగ్గఱగా ప్రార్థించువారు) అగుదురు తమంతట తామే పండితులు. ఏమి ఫలము (మాయొక్క) వ్యర్థ ప్రార్థనలచేత?

నాస్మాక మితి=(దం.) లేదు మాకు సవారి, లేదు ఏదియు కంకణములు మొదలయిన యలంకారములయొక్క సత్కారము, లేదు ఎత్తయిన గుఱ్ఱము, లేఁడు ఎవఁడును సేవకుఁడు, లేనే లేదు వస్త్రము సుందరమయినది; మఱియేమనిన భూతలమందుండు సమస్త విద్వాంసులకు సాహిత్య విద్యను పొందినవారికి మన స్సంతోషము చేయునది తలవంపు చేయునది విద్య దోషములేనిది కలదు మాకు.

అః=ఇది కోపపీడలను తెలియఁజేయు నవ్యయము. ఇక్కడ కోపమును తెలుపును, మా కృథాః=చేయకు.

నిశ్వాస ఇతి=(దం.) ఊపిరి కూడ బయిటికి రాదు బాణకవి (బాణము) మనస్సున (రొమ్ములో) నుండఁగా. ఎట్లు (వచ్చును?) మఱి ప్రసిద్ధమయిన వేగముగల శ్లోకపాదముల (అడుగుల) కట్టుపాటుగల కవనము (సరస్వతి)!

హాతా దితి=(దం.)బలాత్కారముచేత లాగఁబడిన కొన్ని పదములను రచించునట్టి మనుష్యుఁడు స్పర్ధగలవాఁడు అగునేని అహాహా కవితో వశ్యమయిన వాక్కుకలవానితో, కలుగును ఈదినమో రేపో,ఏల ఇక్కడ పెక్కుమాటలు? పాపిష్ఠియైన కలియుగములో, కుండలయొక్క(లను) చేయువానికిని(కుమ్మరికిని) మూఁడులోకములయొక్క(లను) చేయువానికిని (బ్రహ్మదేవునికిని) కలహము,

కలయతి=పొందును.

౬౬. వృ.—శివ సన్నిభః=శివునితో సమానుఁడైన(సర్వజ్ఞుఁడైన).

ముక్తాభూషణ మితి= (దం.) ముత్తెములు ఆభరణములుగాఁగలదిగా చంద్ర బింబము ఆయెను. వెదచల్లఁబడిన నక్షత్రములుఁగలదిగా ఆకాశము (ఆయెను). మన్మథునిదైన విల్లు పోయిన చాంచల్యముఁగలదిగా (నిశ్చలము) ఆయెను. నల్లఁగలువలు(రెండు)ముద్రగలవి (ముకుళించినవి) (అయినవి). అడఁగిపోయినది కోకిలలయొక్క మెల్లనయిన కూఁత. మెల్లని వాయువులు మందమైపోయినవి. చలనములేని పూగుత్తులుగలదిగా సంపంగితీఁగ అది ఆయెను. ఎటుఁగను పిమ్మట.

• (తా). (రతాంతమందు) ప్రియురాలిముఖమందు చెమటబిందువులు కలిగి ముఖమునకు ఒక క్రొత్తశోభను కలిగించినవి. మెడలోని ముత్యాలహారములు పెటిగిపోయి ముత్తెములు నడుముపై రాలినవి. (ముత్తెములు పెటిగి నడుముపై రాలుట పూరుషాయితమును సూచించును.)బొమముడిపాటుజంకెనలు పోయినవి. కన్నులు మూసికొనిపోయినవి. మణితధ్వనులు నిలిచిపోయినవి. నిశ్వాసము మందమయినది. కుచములయుబ్బులాటము తీటినది. అటుపైదశమనోగోచరము కాదు.

స్విన్న మితి= (దం.) చెమర్చినది బింబము చంద్రునిది. జాటిపోయినది పువ్వులసరముల మొత్తముచేత కట్టఁబడిన చీఁకటి. పూర్వమే ప్రకటమగుచున్న (ముదురుచున్న) మొగలిపువ్వుయొక్క అగ్రముయొక్క రూపముకలదియైనది చక్కని చిటునవ్వు. శమించినది కమ్మ

లయొక్క (కుండలములయొక్క) ఆరభటీవృత్తిప్రధానమయిన పురుషనాట్యము. కలువలజంట అడ్డముగా ముకుళించినది. పోయినది పగడముయొక్క సీత్కారము. పైన ఎఱుఁగను సుమా ఏ మయినదో అని.

(తా.) (ప్రియురాలికి) ముఖము చెమర్చినది. పూలసరములతో కట్టఁబడినకొప్పు వీడిపోయినది. చిఱునవ్వు ముదురుచున్న మొగలిరేకుకొనవలె అయినది. (మొగలిరేకు లేఁతలో మిక్కిలి తెల్లఁగానుండును. ముదిరిన కొలఁదియు చుట్టును ఓరను మొదట కొంచెముగాను పిమ్మట మఱికొంత తరువాత మఱియుం గొంతగా తెలుపెల్ల తగ్గిపోయి చిట్టచివరకు రవంత ధావళ్యము రేకుయొక్క మూలమందు మిగిలి పిమ్మట అదియునుం బోవును. అప్రకారమే చిఱునవ్వుయొక్క ధవళకాంతి మొదట కొంతదూరము వ్యాపించి పిమ్మట అంతదూరము రాక అంతకన్న తగ్గి క్రమక్రమముగా మఱియు మఱియు సంకోచించి చివరకు అధరమందే నిలిచి పిమ్మట అందుఁగూడ అదృశ్యమయినది.) కుండలములయొక్క ఊఁగులాటలు శమించినవి. (కుండలములకు ఉద్ధతనాట్యమును చెప్పుటచేత పురుషాయితము సూచింపఁబడినది.) కన్నులు అడ్డముగా మూఁతపడినవి. ప్రియుఁడు మాటిమాటికి చురుక్కన నధరమును కఱచుటచే నయిన నొప్పికి కలుగుచున్న సీత్కారము నిలిచిపోయినది. అటుపైదశ మనోగోచరము గాదు.

అవనౌ=భూమియందు. ఘటాయామ్=త్రాసులో.

౬౭. పు.—సదసి=సభలో. తత్పరిభవః=అతని కావమానము.

స్వ అవతంస కల్హార మకరన్దమ్=త నకొనుచెవియందలి ఎఱ్ఱఁగలువయందలి తేనెను. వామ కర నఖ అగ్రేణ=ఎడమ చేతి గోటికొనతో. విక్షేప=విస్మేమ.

అహో ఇతి=(దం.) అహో! నా అదృష్టము! నాయొక్కయు భవభూతియొక్కయు వాక్కును తులయందు పెట్టి, అగపడఁగా ధ్వాని యంచు(భవభూతివాక్కునందు) తేలిక, వాక్కులయొక్క దేవత వెం

టనే చెవియందున్న ఎఱ్ఱఁగలువ మొగ్గయొక్క తేనెయొక్క మా
ధుర్యమును చల్లుచున్నది పూర్తికె భగవతి!

మనుతే స్మ=తలఁచెను. స్వైరిణీమ్=జారిణిని. సంకేతమ్=జారి
సంగమమునకు ఏర్పఱచుకొన్నచోటికి. చతురా=నేర్పరియైన.

త్వత్తోఽపీతి=(దం.)నీకన్న ను క్రూరుఁడు ఓరాజా వేసి(క్రూర)
బాణములవాఁడు (మన్మథుఁడు) ఓభూమియొక్క భర్తా (రాజదండ
న యైనను సహ్యము, మదనబాధ సహ్యముగాదని భావము.) ఆజ్ఞను
ఎవనియొక్క (ఏమన్మథునియొక్క) రుద్రాదులు దాసులవలె శిరస్సు
న వహించుచున్నారో. (మదనబాధకు లోఁబడుట నాయందు తప్పు
గాగ్రహింపఁగూడదు. త్రిలోచనుఁడుకూడ దానిని జయింపలేక పో
యెనుగదా, నావలన నగునా అని భావము.)

దోర్దణ్డాత్=దండమువంటి బాహువునుండి. అఙ్గద=బాహుపురి.

ఉ. పు.—మఞ్చక=మంచము. స్థూణా=నిట్రాడు. జలద ఆగ
మః=మేఘముల రాక (వర్షాకాలము) వత్సస్య=కుమారునియొక్క.
ఘటికా=పిడత. పర్యాకులా=దుఃఖితురాలై. వధూమ్=కోడలిని.
శ్వశ్రూః=అత్తగారు.

శుక్తిద్వయేతి= (దం.) ముత్తెపుచిప్పలజంటయొక్క సంపుటము
ఓ భోజరాజా కీర్తియను సముద్రములో నీయొక్క ఆకాశము. తలం
తును అందునుండి పుట్టువుగల ముత్తెమునుగా చంద్రబింబమును.

క్వణయుతౌ=ధ్వనితో కూడినవి. క్షుభ్యత్ క్షీరధి దుగ్ధ ముగ్ధ
మహసీ=కదలుచున్న పాలసముద్రముయొక్క పాలయొక్క సుంద
రమయిన కాంతికలవి. వాససీ=రెండువస్త్రములు. వికాసికా=ప్ర
కాశించునది. సు భాషిత కలా కౌశల్యమ్=మంచి పలుకులయొక్క
విద్యయందు నేర్పు.

అజ్జమితి= (దం.) మచ్చనుగా కొందఱు తలంచినారు, సము
ద్రముయొక్క బురదనుగా ఇతరులు తలఁచినారు, లేడినిగా కొందఱు

చెప్పినారు, భూమియొక్క ప్రతిబింబమునుగా ఇచ్ఛగించినారు ఇతరులు, చంద్రునియందు ఏది పగులఁగొట్టఁబడిన యింద్రనీలముల ముక్కలవలె నల్లనిది మిక్కిలి అగపడుచున్నదో దానిని దట్టమయినదానిని రాత్రి త్రాగఁబడిన కటికిచీఁకటిని కడుపులో నున్నదానినిగా చెప్పుచున్నాము.

౬౫. పు.—లక్ష్మీ రితి= (దం.) లక్ష్మియొక్క క్రీడాసరస్సు, తెల్లకాంతియొక్క యిల్లు, అద్దము దిక్కులనెడు స్త్రీలయొక్క, పువ్వురాత్రియను తీఁగయొక్క, మూఁడులోకములను జయించువాఁడయిన మన్మథునియొక్క గొడుగు,ముద్దయయిన శివుని నవ్వు,దేవనది (గంగ) యొక్క తెల్లఁదామర, (ఈ) చంద్రుఁడు వెన్నెలయను నమృతముయొక్క బావిని పుట్టించుచున్నాఁడు, సమూహము నక్షత్రముల నెడు గుండ్లయొక్క.

తర్క ఇతి= (దం.) తర్కవ్యాకరణ మార్గ హితమయిన బుద్ధిగలవాఁడను కాను,సాహిత్యమెఱిఁగినవాఁడను కాను,ఎఱుఁగను విచిత్రకావ్య నిర్మాణముయొక్క నేర్పును మిక్కిలి ఆశ్చర్యమగుదానిని; దేవత యొకానొకతె బ్రహ్మయను ప్రియునిచేత పొగడఁబడినది చేత నున్న వీణయొక్క మధుర ధ్వనితో వేఱుకాని ధ్వనిగలుగునట్లుగా అట్లయినను ఏమో చెప్పుచున్నది నోట నున్నదై నాయొక్క.

సులలితం ప్రబన్ధమ్=మధురమయిన రచనను.

మాతఙ్గీ మితి= (దం.) మాలదానిని వలె మాధుర్యమును (మధురపదగుంభనను) వ్యఙ్గ్యార్థాతిశయముగలకావ్యముల నెఱిఁగినవారు స్పృశింపనే స్పృశింపరు ఉత్తమమయినదానిని. వ్యుత్పత్తిని కులకన్యకను వలె శృంగారాదిరసముల చేత నున్మత్తులయినవారు చూడరు వీరు. కస్తూరీ కర్పూరముల పరిమళములకు చెలి వ్యుత్పత్తి మాధుర్యముల కూడిక చెవికి మధురౌషధము ధన్యునికి ఎవని కో కలుగును.

విర శేతి=(దం.) దూరదూరముగానున్నవి పెద్ద నక్షత్రములు క లియుగమందు వలె సత్పురుషులు (పెద్ద నక్షత్రములుమాత్రము కొన్ని అగపడుచున్నవి). మనస్సు వలె మునియొక్క అన్నిచోట్ల ను స్వచ్ఛ మాయెను ఆకాశము. తొలఁగిపోవుచున్నది చీఁకటి (అజ్ఞానము) మనస్సునుండి సత్పురుషులయొక్కయుం బోలె దూరమునకు. పోవుచున్నది రాత్రి త్వరగా సిరి ఉద్యోగహీనులయొక్క వలె.

౭౦. వు.—అయెను పచ్చనిదిగా తూర్పు పాదరసము వలె భక్షించి బంగారమును (బంగారమును గ్రసించిన పాదరసమువలె తూర్పు పచ్చఁబాఱినది). పోయిన కాంతిగలవాఁడు చంద్రుఁడు పండితుఁడు వలె మూర్ఖుల సభలో (మూర్ఖులనడుమ తగులుకొని వారిని రంజింపలేక వారిచే పరిహసింపఁబడి వెలవెలఁబోవుచున్న పండితునివలె చంద్రుఁడు శోభాహీనుఁ డాయెను). క్షణములో క్షయించినవి నక్షత్రములు రాజులు వలె ప్రయత్నాసక్తులుకాని. దీపములు వెలుఁగుట లేదు వినయ హీనులయొక్క వలె సుగుణములు.

మాలాకార పత్నీ=పువ్వులసరములు చేయు (గుచ్చు)వాని భార్య.

సమున్న తేతి= (దం.) మిక్కిలియున్నతమయిన దట్టమయిన చను గుత్తులను ముద్దుగొనుచున్న అనపకాయ (బుఱ్ఱ) చేత ధ్వనించు చున్న మధురమయిన వీణగలదైన దేవ లోకముయొక్క చంచలమయిన కనుబొమలుగలదాని చేత (సుందరిచేత) నీది పాడఁబడుచున్నది శివుని కిరీటపు కొనను ప్రకాశించు మంచు కిరణములవాని (చంద్రుని) మొలకయొక్క కిరణముల ప్రవాహమువలె తెల్లని కీర్తి. (నీకీర్తి స్వర్గమున కూడ వ్యాపించినది అని తా.)

ఉలూఖల పరాయణామ్=ఱోటియందు ఆసక్తురాలిని (ఱోటిలో ఏమో దంపుచున్నదానిని). ముసలమ్=రోఁకలిని. కాష్ఠమ్=కొయ్య.

జగ తీతి=(దం.) లోకములో తెలిసినదే ఇది కొయ్య వే అగుదువు నిజముగా, అది యూ ను కదా సత్యము అడవిలో పెంపఁబడి నా

వు; క్రొత్త కలువలవంటి కన్నులదానియొక్క చేతితోడి సంగపు పం
డువునందు దీనియందు, ఓరోకలీ చిగురు నీకు తత్క్షణమే ఏల పుట్ట
లేదో. (నీవు మహాజడపదార్థమవు, నీ కెట్లు తెలియును ఆసుందరిచేతి
స్పర్శయొక్క స్వారస్యము ? రసికునికే ఆపాణిసంగము కలిగినయెడ
ల అతనిదేహము చిగిర్చియే యుండును అని ధ్వని.)

౭౧. పు.—ఛన్న మితి=(దం.) కప్పఁబడినదానిని సైన్యముయొ
క్క ధూళియొక్క భారముచేత నీయొక్క శ్రీమంతుఁడయిన భోజరా
జా భూమియొక్క పరిపాలనయందు నేర్పుగలవాఁడా దక్షిణదేశపు
రాజు చూచి అంతరిక్షమును క్షణములో సందేహములేనివాఁడై అవ
మానములేనివాఁడై సేవకులులేనివాఁడై బంధువులులేనివాఁడై స్నేహి
తులులేనివాఁడై భార్యలులేనివాఁడై పిల్లలులేనివాఁడై తమ్ములులేని
వాఁడై బంగారములేనివాఁడై వెడలిపోయెను. (భోజునిదాడికి అడలి
దక్షిణదేశపురాజు సర్వమును వదలి పాఱిపోయెను.)

అకాణ్డేతి= (దం.) అకాలమందు ధరింపఁబడిన మానససర
స్సునకైన(ప్రయాణ) ప్రయత్నముయొక్క సంతోషముగలవైన హం
సలచేతను, అకాలమందలి దృఢ తాండవముగల నెమళ్ల సమూహ
ముచేతను, దిక్కులు చూడఁబడినవి వీరావేశముతో ధరింప శక్యము
కాకుండ నడచుచున్నదైన నీ గొప్ప సేనచేత రేపఁబడిన భూమియొ
క్క ధూళిచేత నల్లనివి. (నీసేన నడవఁగా రేఁగినదుమారమును దిక్కు
ల నంతటను చూచి మేఘావరణ మని తలఁచి హంసలు మానససర
స్సునకు ప్రయాణోన్ముఖమైనవి, నెమళ్లు ఆడసాగినవి. హంసలు వర్షాకా
లములో మానససరస్సునకు పోవు ననియు మేఘములు చూచి నెమ
ళ్లాడు ననియు కవిసంప్రదాయములు.)

రటన్తమ్=కటువుగా అఱచుచున్న. కూజన్తమ్=కూయుచున్న.

నో చారూ ఇతి=(దం.)కావు అందమయినవి కాళ్లు,కాదు పిఱి
ఁదియు అందముయినది ముక్కు,కాదు చెప్పఁదగినది మాట,కాదు విలాస

ముచేత చతురమయినది నడక, కాదు తెల్లనిది అెక్కలస్వీకారము ఇది నీయొక్క; పరుషమయిన క్రేంకారధ్వనిచేత భరింపశక్యముగాని వాక్కును ఈచోట వృథాగా నే పలుకుచు మూర్ఖమవయిన ఓకాకీ సిగ్గయిన పడవు(నీవు) తగని పాండిత్యమును మిక్కిలి అభినయించుచు.

గర్హణమ్=నిందనుగా.

తు ల్యేతి= (దం.) సమానవర్ణపు రెక్కలుగలవైన నల్లనిది కోకిలలతో కూడ చేరినదైన ఎవనిచేత చెప్పఁబడును కాకి స్వయముగానే మాటలాడని యెడల? (కాకియు నలుపు కోకిలయు నలుపు. రెండును కూడియున్నప్పుడు కాకి కన్నుని కూయనియెడల అది కాకి యని తెలియదు. మాసాంగత్యముచేత నిన్ను మహాకవి యని తలంతురు, నీమాటచేతనే నీవు కవివి కావని తెలియఁబఱుచుకొంటివి, అని భావము.)

మిథః=పరస్పరము.

౭౨. పు.—క్షితిరుహామ్=చెట్లయొక్క. శిశిర=చల్లని, సరితామ్=నదులయొక్క.

య త్రేతి=(దం.)ఎక్కడ నీరు అమృతమును నిందించునో(అమృతముకన్న శ్రేష్ఠమో), చండాలురు ఇంద్రుని (నిందింతురో), చింతామణిని రాలు (నిందించునో), అక్కడ మా ఉనికి ఓరాజా.

నివాస ఇతి=(దం.)ఉనికిపట్టు ఎక్కడ ఇప్పుడు మాకు? దానము చేయఁబడినది భోజునిచేత బంగారపు పర్వతము (మేరువు); అని దేవతలు వ్యాకుల చిత్తము గలవారు (అని) భోజరాజా వార్త క్రొత్తది.

౭౩. పు.—సార్ధ్యా ఇతి=(దం.)శేల్లు చెలికాండ్రు, ఇల్లు కొండ గుహ, శమమే ప్రియ భార్య, జీవనము అడవి తీఁగలయొక్క ఫలములచేత, వస్త్రము ఉత్తమమయినది చెట్లయొక్క పట్టలు, మంచిమాటలనెడు అమృత ప్రవాహమందు మునిఁగిన మనస్సుగలవారికి ఎవ్వరికి ఈసౌఖ్యము (కలదో), వారికి చంద్రకళాశేఖరుని(శివుని) యొక్క యతులమయిన మోక్షమందు కూడ మాకు ఆశ లేదు.

తీర్థేషు=తీర్థములను. తీర్థం భోజ పరం హి సః=భోజరాజా అతఁడే ఉత్తమతీర్థము సుమా.

మేరౌ వితి=(దం.) మేరువునందు, మందరపర్వత గుహాలయందు, హిమవంతముయొక్క చఱియయందు, మహేంద్రపర్వతమందు కైలాసముయొక్క రాలమీఁదను, మలయపర్వతముయొక్క శిఖరములయందును, సహ్యపర్వతమందును, ఆ యాచోట్ల తఱచుగా ఓభోజరాజా వినఁబడినది నీది నాచేత చక్రవాళమందు సంచరించెడు చారణ సమూహములచేత బిగ్గరగా పాడఁబడుచున్న కీర్తి.

౭౪. పు.—నాద్రియతే=ఆదరింపఁడు.

సావజ్ఞమ్=తిరస్కారముతో. సముదితః=చక్కఁగా చెప్పఁబడినది.

అల్లాళక్షోణిపా లేతి= (దం.) అల్లాళరాజా, నీ శత్రువుయొక్క పట్టణములో తిరుగుచున్నదై బోయది చల్లఁబడి(=అక్కడక్కడ పడి)యున్నవానిని గ్రహించి రత్నములను మిక్కిలిగొప్ప చంద్రనిప్పుకలనెడు భ్రమచే ఆకులమయిన యంతరంగము (మనస్సు) గలదై వేసి చందనపు ముక్కను వానిపైన మూఁతపడిన కన్నులుగలదై ఊఁదుచున్నదై ఊర్పులయొక్క పరిమళమునకై వచ్చిన తుమ్మెదల గుంపులచేత పొగయను భ్రమను వహించుచున్నది.

(అల్లాళరాజుయొక్క ప్రతాపమునకు భయపడి అతని శత్రురాజు అడవిఁబట్టఁగా వానిరాజధాని పాడై అడవి కాఁగా, అందు కిరాతులు చేరి నివసించియుండఁగా, అందు కూలి పడిపోయిన రత్నఖచితములైన గోడలపెద్దపెద్దరత్నములు అక్కడక్కడ పడియుండఁగా, వంటకు నిప్పు సంపాదించుటకై ఎక్కడనయిన కార్చిచ్చుండునాయని వెదకుచు వచ్చినయొక కిరాతి ముగ్ధ యగుటచేత ఈపడియున్న దేదీప్యమానమైన రత్నములను అడవులలో సహజముగానే యుండెడు కార్చిచ్చుయొక్క పెద్దపెద్దచంద్రనిప్పుకణము లని తలఁచి వానిని పిడకమీఁద పెట్టి ఆపైన నలిగా పాడుపడిన యాపట్టణపు ఇం

ర్లకలపయొక్క చందనపుముక్కలు అక్కడక్కడ పడి యుండఁగా వానిని వేసి ఊఁద సాగినది. అంతట తనశ్వాసపరిమళమునకు ముఖముమీఁద మూఁగినతుమ్మెదలను నిప్పు రాజి బయలు దేఱినపొగ యని తలఁచి, ఆపొగ తనకన్నులలో చొరకుండు నట్లు కన్నులుమూసికొని మంటకొఱకు ఊఁదుచున్నది అని అర్థము. అల్లాళరాజు మహాప్రతాపశాలి, ఎంతటి ఐశ్వర్యవంతులయిన శత్రురాజులును ఈయన ప్రతాపమునకు నిలుపలేక తమరాజ్యములు పొడుపెట్టి నామరూపములు లేక పోయినారు అని తా.)

ఏణీ దృశామ్=ఆఁడులేడియొక్క కన్నులవంటికన్నులుగలవారయిన (స్త్రీలయొక్క. అపదేశ పూర్వైః=వ్యాజ పూర్వకములయిన. అపాఙ్గపాతైః=కటాక్షములయొక్క ప్రసారములచేత. యువానః=యౌవనవంతులు. శృఙ్ఖలితాః=సంకెళ్లువేయఁబడినారు. (మేడలనుండి స్త్రీలు వీథిని పోవుచున్న పురుషులను క్రేగంట చూచినమాత్రముననే ఆ పురుషులు వారిని మోహించి నిలిచినచోటనే నిశ్చేష్టులై యుందురే గాని అవతలికి మఱి యడుగు పెట్టనేర రని యర్థము. ఆపట్టణపుస్త్రీలు మహాసుందరాంగులును జాణలు నని తా.)

అమ్భో జేతి—ఇహ=ఈయేకశిలానగరమందు, అమ్భోధి దీర్ఘాసు=సముద్రములవలె విశాలములైన, దీర్ఘికాసు=దిగుడుబావులయందు, సమాగతానాం=వచ్చినట్టి, అమ్భోజ పత్త్రాయత లోచనానామ్=కమల దళములవంటి విశాల నేత్రములుగల స్త్రీలు, కుటిలైః=వక్రములైన, అపాఙ్గైః=క్రేగంటి చూపులనెడు, అనఙ్గ బాణైః=మన్మథబాణములచేత, యువానః=కోడెకాండ్రు, ప్రహతాః=కొట్టఁబడినారు.

౭౫. పు.—కుము దేతి= (దం.) తెల్లఁగలువల సమూహము తొలఁగిన సిరి గలది (శోభాహీనము) (అయినది), శ్రీగలది (ఆయెను) క

మలముల సమూహము, వదలుచున్నది సంతోషమును గ్రుడ్లగూబ, సం తోషముగలది (అగుచున్నది) చక్రవాకము; ఉదయమును (పొడుపు టను, అభ్యుదయమును) సూర్యుఁడు పొందుచున్నాఁడు, చంద్రుఁడు అస్తమును (క్రుంకుటను, నాశమును) (పొందుచున్నాఁడు). పాడు విధియొక్క క్రీడలకు అయ్యో! విచిత్రముగానున్నది పరిణామము! (ఇది ప్రాతఃకాల వర్ణనము. ఎట్టివారికిని కలిమిలేములు అనియమము లని యు కనుకనే మహైశ్వర్యసంపన్నుఁడై యుండినతనకు ఇప్పుడు లేమి వచ్చినదనియు తా).

శారద చన్ద్ర కిరణ గౌరాః=శరత్కాలపు చంద్రుని కిరణము లవలె తెల్లనయిన.

ఆశ్వా స్యేతి= (దం.) ఓదార్చి పర్వతముల సమూహమును సూ ర్యుని వేఁడిచేత కాల్పఁబడినదానిని, ఉగ్రమయిన కార్చిచ్చుచేత పా డయిన యడవులను కూడ, అనేకములయిన నదుల(తూర్పునకు పారె డు నేళ్ల) యొక్కయు నదముల (పడమటికి పారెడు నేళ్ల) యొక్క యు నూర్లను కూడ నిండించి, రిక్తుఁడ వైనావనుట యేదో ఓమే ఘుఁడా అదే నీకు ఉత్కృష్టమయిన సిరి. (ఎల్లవారికిని త్యాగము చే సి దరిద్రుఁడ వయినావు, మాఘుపండితా అదే నీగొప్ప అని తా.)

రతిమ్=కోరికను. దుర్లలితమ్=దుష్టమయిన. ప్రాణాః=ఓప్రాణ ములారా. వ్రజత=పొండి. పరిదేవనేన కిమ్=దుఃఖించి ఏమిఫలము.

౭౬. పు.—అనల=నిప్పుయొక్క. విఘాత అన్తర్ ర్దాహః=భంగ పెట్టుటవలని లోపలి మంట. అర్థిభి ర్వ్రజత=యాచకులతో పొండి.

పశ్చా దితి=(దం.) పిమ్మట నైన ను పోవలసినదే, ఎక్కడిది నో బత్తు మతి యిట్టిది?

విలపన్=ఏడ్చుచు. అగాత్=పోయెను. భూభుజః=రాజులు. స్వ భార్యా సహాయః=తన భార్యతోడుగా గలవాఁడై. మ్రియతే= చచ్చిపోవుచున్నాఁడు. విపన్నమ్=చచ్చినవానినిగా.

౨౨. పు.—ఫలే విసంవాదీ=ఫలమందు విపరీతము (అగును.) హి త్వా=వదలి. భవ ద్గిరః=నీ వాక్కునకు. పలాశే=మోదుగుచెట్టున. తం భూపాలమ్ అపృచ్ఛ్య=ఆరాజునొద్ద సెలవుపుచ్చుకొని.

ఆరనాళ= (దం.)తరవాణియొక్క గొంతులోకాల్చుటయొక్క భయముచే (నాకంఠములో నున్నయెడల నేను త్రాగెడు తరవాణి త న్నుకాల్చు నని భయపడినదై)నా నోటినుండి లేచిపోయినది సరస్వ తి. అందుచేత శత్రువుల లక్ష్మియొక్క కొప్పును పట్టుకొనుటయందు ఆసక్తమయిన చేయిగలవాఁడా లేదు కవనము నాకు.

తా.—నేను మిక్కిలి పేదవాఁడను మంచిభోజనము లేక తరవాణి నీళ్లచేత కాలము గడపుచున్నాను. విశేషపండితుఁడనుకాను. నీవిద్వ త్సభను చూడఁగా సభాకంపము గలిగి అదివఱకు ఊహించుకొనివ చ్చిన కవనమును కూడ మఱచి పోయినాను. నీవు శత్రువులను జయిం చి వారిసిరినెల్ల గ్రహించి మహైశ్వర్యవంతుఁడవయి యున్నావు, నా కే మయిన దయచేసి నాదారిద్ర్యమును తీర్పవలయును.

మహిషీ శతమ్=నూఱుగేదెలను. (గేదెలను ఇచ్చుటయందు ఇఁక మీఁద తరవాణి త్రాగ నక్కఱలేదు,సమృద్ధిగా గేదెపెరుఁగు త్రాగు చు సుఖముగా జీవింపుము అని భోజుని యభిప్రాయము).

అనుషక్తి=సంబంధించినది.

౨౩. పు.—కచభారా దితి= (దం.) కొప్పుబరువునకు స్తనభారము (భయపడుచున్నది), స్తనభారమునకు భయపడుచున్నది కచభారము, కచకుచములభారమునకు పిఱుఁదులు భయపడుచున్నవి. ఏమిటి యిది చంద్రముఖీ చమత్కారము? (ఒకదానికన్న నొకటి గొప్పదిగా నున్న దని తా. మఱియు విషయునిగరణముచేత, రాత్రికి చక్రవాకములు, ఏ నుఁగుకుంభములకు నాచు, మేఘమును కొండలను చూచి వర్షము కు రియును సెలయేళ్లు వెల్లువలు పాఱును ఆవెల్లువలు తన్ను కోసివే యును అని తలఁచి యిసుకతిన్నెయు, భయపడె నని తా.)

వదనా దితి=(విషయనిగరణముచేత,) చంద్రునికి కమలములు, చిలుకలకు దొండపండును దాడిమగింజలపఙ్క్తియు, రాత్రికి చక్రవాకములును లేడి సింహమునకును భయపడుచున్నది—అని యర్థము.

స్వ అఙ్కే శయానమ్=తన తొడమీఁద నిద్రించుచున్న. వైశ్వానరమ్=అగ్నిదేవుని. యదృచ్ఛయా=స్వేచ్ఛగా, తనంతటే.

౭౯. పు.—హుతాశనః=అగ్ని. పావకే=నిప్పులో. చన్దన పఙ్క శీతలః=గంధపు ద్రవమువలె చల్లనివాఁడు. ఘర్మ=గ్రీష్మ=వేసవి.

మరు దితి=(దం.)గాలియొక్క రాకయొక్క వార్తచేత కూడ హీనమైయుండఁగా కాలము (గాలి బొత్తుగా లేనప్పుడు), మేలుకొని (దుస్సహమై) యుండఁగా మిక్కిలి ప్రబలిన ఉష్మదము.

ఉర గీతి=(దం) ఆఁడుఁబాము శిశువునకు ఆఁకలిగొన్నదానికి తనదానిని పెట్టెను ఫూత్కారమును (బుసను) ముఖవాయువుచేత. (పాములు గాలిని తిని బ్రదుకునవి కాఁబట్టి గాలి లేనందున తల్లిపాము శిశువునకు తనఫూత్కారవాయువును మేపెను).

అబలా స్వితి= (దం ) సుకుమారస్త్రీలయందు విలాసవంతులు అనుభవించిరి నేత్రములచేత నే క్రొత్త యాలింగనములను (దర్శనానందము ననుభవించిరే గాని స్పర్శానందము ననుభవింపరైరి).

ఆర్తః=బడలినవాఁడై. నిబిడ=దట్టమయిన. జమ్బ్వా=నేరేడు.

౮౦. పు.—కపిభిః=కోఁతులచేత. హస్త విస్ఫాలనేన=చేతిచప్పట్లచేత. తారం రారటీతి స్మ=గట్టిగా మాటిమాటికి అఱచినది. ఉరసి=హృదయమునందు. అయే మాతః=అయ్యో అమ్మా! చక్రన్ద=ఏడ్చెను. అన్తర్హితః=దాఁగినవాఁడై (మాఱువేషముతో) పేటికామ్=పెట్టెను. వాహయిత్వా=మోయించి (పట్టించుకొని).

౮౧. పు.—ఆత్మానం గోపాయిత్వా=ప్రచ్ఛన్నముగా. గ్రావహణామ్=మొసళ్లకు. శూల అగ్ర ఆరోపితేన=కొఱ్ఱుయొక్క కొనను ఎక్కింపఁబడిన(కొఱుత వేయఁబడిన).రుతాత్=కూఁతవలన. తరలి=,

దాఁటుమను. కన్దుక లీలా=బంతి యాట. ప్రమదా=సుందరియొక్క యధరోష్ఠమును చుంబించుటకు ఆశగలదాని వలె. తామరస=తామరపువ్వు. ఉత్పతసి=ఎగురుచున్నావు. రాగ=ఎఱుపు.

చరణేతి—కాలి గోళ్ల కిరణములచేత తెల్లతెల్లఁగాను, అంతరాళమున నున్నదై కన్నుల కిరణములచేత నల్లనల్లఁగాను.

పయోధరేతి=(దం.) కుచముల ఆకారమును ధరించిన దగుటచే బంతి చేతితో కోపముతో కొట్టఁబడుచున్నది మాటిమాటికి; ఇట్లని యుంబోలె కంటియాకారముకలది (కనుకనే) భయపడిన (కొనచెవియందలి) కలువ (స్త్రీ)యొక్క దయకై పడెను పాదములలో.

రా—తి. పు.—అనే కేతి=(తా.) ఎండలో రాజులు కలరు దుర్బలులను కొట్టి వారిసిరిని హరించువారు. ఓభోజరాజా నీ వొక్కఁడవే కలవు లోకమునంతయు పాలింప సమర్థుఁడవు.

హేమన్తకాలే=చలికాలములో. జ్వలన్తీమ్ హసన్తీమ్ సంసేవమానః=మండుచున్న కుంపటిని కాఁచుకొనుచు.

కవిమతిరితి=(దం.) కవియొక్క బుద్ధి వలె విస్తారమయిన యూహాలుకలదై (విస్తారమయిన లోహముకలదై), చక్కఁగా కూర్పఁబడిన చక్రవాకపక్షులుగలదై (చక్రములు గలదై) ప్రాతః కాలము వలె, శివుని యాకృతి వలె కుంపటి(నవ్వుచున్నదై) ప్రకాశించుచున్నది, చంద్రుఁడు పార్వతి నిప్పు వీనితో (హాగలేని నిప్పుతో) కూడుకొన్నదై.

ద్యూత పణ జయ=జూదముయొక్క పందెముయొక్క గెలుపుచేత. అగ్ర మహిష్యామ్=పెద్ద రాణియందు. దాక్షిణ్యా=దయా. విశేష అనవధారణేన=విశేషముయొక్క అనిశ్చయముచేత. కృత ఆహ్నికః=చేయఁబడిన ప్రాతరనుష్ఠానముకలవాఁడై. త్ర్యక్షర ఊన తురీయ చరణామ్=మూఁడక్షరములచేత (ములు) తక్కువయైన నాలవపాదము గలదానిని.

౮౩. పు.—స్నా తేతి=(దం.) స్నానముచేసి యున్నది కుంతలేశ పుత్రి, వంతు అంగరాజు చెల్లెలికి, జూదములో రాత్రి యిది జయింపఁబడినది కమలచేత, దేవియొక్క కోపమును తీర్పవలసియున్నది ఇప్పుడు; అని అంతఃపుర సుందరీ జనులయొక్క గుణమునందు తక్కువయొక్కవలు ఆలోచించుచు నీవు నిర్ణయము తోఁపసందున మూఢమయిన మనస్సుగలవాఁడవై రెండుమూఁడు ఉంటివి గడియలు.

విద గ్ధేతి=(దం.) చక్కఁగా కాల్పఁబడినదియు (నేర్పరియు),అందమైన నోరుకలదియు (ముఖముకలవాఁడును) ఎఱ్ఱనిదియు (అనురాగము కలవాఁడును) పిఱుఁదుపైన ఉన్నదియు(ఉన్నవాఁడును) కాముకురాలిచేత కౌఁగిలింపఁబడిన సుందరమయిన మెడగల (కుండ) యందు (ప్రియునియందు) ధ్వని మణితమువంటిది.

ప్రాదే=మడుగులో. జాలకైః=పల్లెవాండ్ర చేత.

జతు=లక్క. అనుపూర్వ్యాత్=వరుసగా.

అయి ఖలు జన్తుషు పురాకృతానాం కర్మణాం విపాకః విషమో హి భవతి=అయ్యో ప్రాణులకు పూర్వకృత కర్మలయొక్క పరిణామము క్రూరము గదా అగును.

౮౪. పు.—క్వ న్వితి=(దం.) ఎక్కడ కులము నిష్కళంకమయినది విశాలనేత్రయొక్క ఎక్కడ రాక్షసునితోడి సంగమముయొక్క (సంగమము కలిగె ననెడు) అపనిందని (అసంభావ్య మని భావము.)

ధ్వనిదోషం మన్వానః=అభిప్రాయ దోషము (అభిప్రాయము పరుషము గానున్నదని) తలఁచుచున్నవాఁడై.

క్వ జన కేతి=(దం.) ఎక్కడ జనకుని కూఁతురు ఎక్కడ రాముని భార్య! ఎక్కడ ను పదిమెడలవాని యింట నివాసము!

శివశిర సీతి=(దం.) శివుని తలమీఁద తలలు ఏవి ప్రకాశించినవో శివశివా (అయ్యయ్యో) ఆతలలు దొర్లుచున్నవి గద్దల కాళ్ల చేత!

(తనతలలను ఖండించి వానితో పుష్పములతోనుంబోలె శివుని పూజించిన రావణాసురుని యాతలలను వానిసంహారమయిన తర్వాత గద్దలు మాంసమునిమిత్తము దొర్లించి శోధించుచున్న వని యర్థము.)

ఉచ్చాటనాయ=తఱుముటకై. యతతే స్మ=యత్నము చేసెను. శేతే స్మ=శయనించెను.

౮౫. పు.—తద్ధృదయగతమ్= బ్రహ్మరాక్షసునిమనస్సులోనిది. పాణినిసూత్రమ్=పాణినిమహర్షికృతవ్యాకరణసూత్రమును.

సర్వస్య ద్వే=అన్నిపదములకును రెండు మాఱులు ఉచ్చారణ కలుగును: ఉ. ఇల్లిల్లు తిరిగెను, ఊఱూఱ చాటెను.

సర్వ స్యేతి=(దం.)అందఱికిని రెండు—మంచిబుద్ధి చెడ్డబుద్ధి, సంపదను ఆపదను హేతువులు.

వృద్ధో యూనా... = యూనా స హోక్తౌ గోత్రం శిష్యతే... ఉ. గార్గ్యశ్చ గార్గ్యాయణశ్చ గార్గ్యౌ.

వృద్ధో యూ నేతి=(దం.)ముసలివాఁడు వయసువానితో కూడ స్నేహముచేత విడువఁబడుచున్నాఁడు కాముకురాండ్రచేత. వయసు వెలువుఁడు దొరకినయెడల కాముకురాండ్రు ముసలిమగని విడుతురు.

ఏకో గోత్రే="అపత్యం పౌత్త్రప్రభృతి గోత్రమ్" అనుసూత్రము వలన పౌత్త్రుఁడుమొదలుగాఁగల వంశ్యునికి గోత్ర మని పేరు, అట్టి గోత్ర మర్థ మగునప్పుడు(ఎన్నవతరమువాఁడు అర్థ మయినను)(ప్రకృతిశబ్దముమీఁద) ఒకటే ప్రత్యయము వచ్చును. ఉ:—ఉపగునిగోత్రాపత్యము (ఉపగునికి ఎన్నవతరమువాఁ డయినను) ఔపగవుఁడు.

ఏకో గోత్ర ఇతి=(దం.) ఒక్కఁడు వంశమునందు జన్మించును పురుషుఁడు ఎవఁడు కుటుంబమును భరించునో. (కుటుంబములో ఆర్జకుఁడొకఁడే, భోజనము చేయువారు అనేకులు).

స్త్రీ పుంవ చ్చ=యూనా స హోక్తౌ వృద్ధా స్త్రీ శిష్యతే, తదర్థ శ్చ పుంవత్: ఉ. గార్గీ చ గార్గ్యాయణౌ చ గర్గాః.

స్త్రీ) పుంవ ద్వేతి=(దం.) స్త్రీ) పురుషునివలె స్వతంత్రముగా వ్యవహారము చేయునో (ఏ) యింట, అది నిశ్చయముగా ఇల్లు పాడు.

నాగః=ఏనుఁగు. శర్వరీ=రాత్రి. జవేన=వేగముచేత. మిథునైః=దంపతులచేత. వసుమతీ=భూమి.

౮౬. పు.—అ మ్బేతి=(దం.) తల్లి కోపగించుచున్నది, నామూలముగాఁగాదు నాభార్యమూలముగాఁగాదు; నాభార్యయుం కోపగించుచున్నది, తల్లివలనఁగాదు నావలనఁగాదు; నేనును కోపగించుచున్నాను, తల్లివలనఁగాదు భార్యవలనఁగాదు; చెప్పుము రాజా ఎవరి దోషము ఇది.

రాజ న్నితి==(దం.) రాజా ద్వారపాలకునివలన నే పొందినాను ఏనుఁగును (నివారణమును); మదపుటేనుఁగును (మద మణచుటను) కోరుచున్నాను నీవలననుండి నేను భూమీశ్వరా.

ప్రాక్=తూర్పు. పరావృత్య=త్రిప్పి. శిక్షితా=నేర్పఁబడినది.

మార్గ ణేతి=(దం.) బాణములయొక్క (యాచకులయొక్క) సమూహము (నీదగ్గఱకు) వచ్చుచున్నది. అల్లెత్రాడు (కీర్తి) పోవుచున్నది అన్యదిక్కునకు. (సామాన్యధనుర్విద్యలో బాణము దూరముగ్గా పోవును, అల్లెత్రాడు చెవియొద్దికి వచ్చును. భోజునిధనుర్విద్యయందు అది విపరీతము అని చమత్కారము. యాచకులు భోజునియొద్దికి వత్తురు, భోజునికీర్తి దిగంతములకు పోవును అని తా.)

ప్రత్యక్=పడమర. మృషా=అసత్యము. ఉదక్=ఉత్తరము. సర్వ దః=సర్వమును ఇచ్చువాఁడు. మిథ్యా=అబద్ధము.

నారయ ఇతి=(తా.)శత్రువులు నీవీఁపును చూడలేదు (నీవు యుద్ధములలో పాఱిపోయి యుండఁగవు) నీహృదయమును పరస్త్రీలు పొందలేదు (సత్పురుషుఁడవు పరస్త్రీకాముకుఁడవు గావు).

౮౭. పుట.—చతుష్టయమ్=నాలుగిఁటిని. మూల్యేన=ఖరీదునకు. భుఙ్క్ష్వ=అనుభవింపుము. తపనే లలాట న్తపే దూనదేహః—సూర్యుఁ

డు నొసటిని కాల్చువాఁడైయుండఁగా తపింపఁబడిన దేహముకల వాఁడై. పిపాసా=దప్పిచేత. నికట తట భువమ్ అటన్=సమీప మందలి (చెఱువు) గట్టుయొక్క ప్రదేశమునకు తిరుగుచు. గోప= గొల్ల. మనోజ్ఞ=మనోహరమయిన. తక్రమ్=మజ్జిగను. పేయం చేత్=త్రాగదగిన దైనయెడల.

౮౮. పు.—హి మేతి=(దం.) మంచు మల్లెపువ్వు చంద్రుఁడు వీనికాంతివంటికాంతిగలది, శంఖమువంటిది,(శశిప్రభ యనుపాఠమం దు చంద్రుఁడు గొప్పనక్షత్రములు శంఖములు వీనివలె ప్రకాశించున ది అని యర్థము.) చక్కఁగా పండిన వెలగపండువలె పరిమళవంతమై న రుచికలది, వయసుదానియొక్క చేతులచేత మిక్కిలిచిలుకఁబడి నదైన (యీ) మజ్జిగను త్రాగుము ఓ రాజా సకల రోగములను హ రించుదానిని.

సుభ్రూ=చక్కని కనుబొమలుకలదానా. ఆవిష్కృత=ప్రకటిత.

ఇన్దు మితి=(దం.)చంద్రుని కలువతీఁగ వలె, చక్రవాక సమూహ ము వలె కమలలతయొక్క ప్రియుని(సూర్యుని చక్రవాకసమూహము వలె), మేఘమును చాతక సమూహము వలె, తుమ్మెదల గుంపు వలె పువ్వుల సమూహమును, మామిడిచెట్టును ఆఁడుకోకిల వలె, స్త్రీ వలె తనభర్తను దేశాంతరముపోయినవానిని, మనోవృత్తి యిది సర్వదా రాజశ్రేష్ఠుఁడా నిన్ను చూచుటకు మిక్కిలి కోరుచున్నది.

మదిరాక్ష్యాః= (చూచువారికి) కామోన్మాదమును కలిగించునట్టి నే త్రములుగల స్త్రీయొక్క (సుందరియొక్క). సోపాన=మెట్లయొక్క.

రాజాభిషేకేతి=రాజుయొక్క స్నానమందు మదనోన్మాదపరవశ యయిన గుబ్బెతయొక్క చేతినుండి జాఱిన బంగారపు కలశము.

ఆరక్షకైః=తలవరులచేత.

౯౦. పు.—సమ్భిలకేన=దొంగచే. ఖాతపాత=కన్నము వేయుట. భద్రబాహ్వోశ్శ్యామ్ అన్తకః సన్నివిష్టః=భ భా భి భీ అనువరుస

యందు యమధర్మరాజు ప్రవేశించినాఁడు. (భకారగుణితము చేసి వ. రుసగా వచ్చునట్టి ఆయక్షరములు ఎవరెవరి పేరునను మొదటి వగునో వారి నంతతిని వరుసగా చంపివేయుచున్నాఁ డని యర్థము.)

అపర=పడమటి. కుహరమ్=గుహను. భాస్కరే=సూర్యుఁడు. అరోచత=ప్రకాశించెను. సన్ధోహ పరికన్దళా=సమూహముయొక్క మొలకలుగలది. చరమ గిరి నితమ్బ లమ్బమాన శశాఙ్క బిమ్బమ్= పడమటి కొండ చఱియందు వ్రేలుచున్న చంద్ర మండలమును.

అరు ణేతి= (దం.) సూర్యునియొక్క కిరణ సమూహములచేత ఆ కాశము పోయిన నక్షత్రములుగలది (నక్షత్రశూన్యము) కాఁగా.

చల తీతి= (దం.) చలించుచుండఁగా చల్లగాలి మెల్లమెల్లఁగా ప్రాతఃకాలమందు.

యువ తీతి=(దం.) గుబ్బెతలసమూహము నాథులచేత వదలఁబడి న దొండపండువంటి యధరోష్ఠముకలది యగుచుండఁగా.

౧౦. పు.—కపాల శోధనా=తలను (లోపలి వైపున) కడుగుట. శఫర శాబః=బేడిస పిల్ల. వికట...టితః=విషమమయిన కపాలపు ఎ ముకయొక్క సమీపమున ఇఱుకుకొన్నది. భిషగ్వరైః=ఉత్తమవైద్యు లచేత. అబ్జ బిమ్బ ఉపమమ్=చంద్ర బింబము సాటిగాఁగలది. క్లీబ స్య=నపుంసకునియొక్క. విపినే=అడవిలో. శిఖావాన్=అగ్ని. గ దః=రోగము. సంయతాక్షరామ్=కట్టఁబడిన యక్షరములు గలదై న. అస్మద్విషయే=మా దేశములో. న వసతిమ్ అతనోతు=నివసింపకుం డునుగాక. బాహట ఆది భేషజ కోశాన్=బాహటము మొదలయిన వైద్యగ్రంథములను. స్రోతసి=ఏటిలో. అవరోధ సఙ్ఘాః=అంతఃపు రస్త్రీ సమూహములు. పురన్దరః=ఇంద్రుఁడు. వీణాముని మ్=నారద మునిని. నిష్క్రామితాః=తఱుమఁగొట్టఁబడిరి. నిరస్తమ్=పాఱవేయఁ బడినది. పురుహూతః=ఇంద్రుఁడు, నాసత్యౌ=అశ్వినులను. ధన్వన్త రీయమ్=ధన్వంతరిదైన.

౯౧. పు.—ఆహతుః=చెప్పినారు. న వ్యలీకమ్=అబద్ధముకాదు. పాఠీనః=చేఁడేప. ప్లవయమాన=నవ్వుచున్న. నితకేనమ్=ఉనికిపట్టు. ఊచతుః=చెప్పినారు. మోహయిత్వా=దేహముమీఁది స్మృతి తప్పించి. సంధానకరణ్యా=ఎముకలనదుకునట్టి ఔషధముచేత.

౯౨. పు.—అన్తర్ అధత్తామ్=అంతర్ధానము పొందిరి. స్నిగ్ధమ్=నేయిగలది. కవి కుల తిలక=కవి సమూహముయొక్క తిలకముచేత (కవిశ్రేష్ఠునిచేత). గాథా సనాథా చీకటికా= పద్యముతో కూడుకొన్నదైన చీటి. కరణ్డమ్=(బరిణను.) వ్యాళమ్=పామును.

గౌరీ కాన్త మితి=శివుని, ఆంజనేయులవారిని సంపంగిని ఇత్యాది.

౯౩. పు.—దేశాన్తర గత కాన్తాయాః=దేశాంతరము పోయిన కాంతుఁడుగలదానియొక్క. తత్తద్భావ ప్రతిభట వర్ణనేన=ఆయా పదార్థములయొక్క శత్రువులను వర్ణించుటచేత. (పాము మొదలయినవివరుసగా మలయమారుతము, మన్మథుఁడు, ఉద్యానవనము తుమ్మెదలు—వీనికి శత్రువులు. మలయమారుతాదులచేత మిక్కిలి బాధపడుచున్నాను. శీఘ్రముగా వచ్చి నన్నుఁ గూడి ఆబాధను తీర్పవలయును అని ఆమెయభిప్రాయము) శిలా గో భూరుహేషు=రాయి ఆవు చెట్టు వీనియందు (కేవలజడపదార్థములయందును జడజంతువునందును అని ధ్వని. చింతామణికామధేనుకల్పవృక్షములయందు అని భా.) విరహిణీ గూఢ నర్మోక్తి పద్యమ్=వియోగినియొక్క అభిప్రాయగర్భితమయినరత్యాశయద్యోతకపదముల పద్యమును. చరమగ్రన్థమ్=చచ్చినపిమ్మట (భోజరాజునుగురించి) లోకులు అనుకొనుసంగతిని తెలుపుశ్లోకమును. మృగయితుమ్=వెదకుటకు.

౯౪. పు.—సామపూర్వమ్=మంచిమాటలతో. విసంజ్ఞః=చైతన్యములేనివాఁడై. ప్రకారాన్తరేణ=మఱియొకవిధముగా.

శ్రీభోజమహారాజచరిత్రటిప్పణి



సమాప్తము.

# శుద్ధపత్త్రము.

| పుట. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| ౧౩. | విక్రమళా | విక్రమకళా |
| ౨౯. | సఖిలు | నఖిలు |
| ౩౬. | క్షు స్తో | స్తో క్షు |
| ౬౪. | వాగ్వల్యాః | వాగ్వల్ల్యాః |

| పుట. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| ౬౬. | నిప్పన్ద | నిష్పన్ద |
| ౬౯. | గోళకస్య | గోళకానామ్ |
| ౮౧. | నిస్త్రీణో | నిస్స్త్రీణో |
| ౧౨౪. | బిగ్గఱ | బిగ్గర |